7

Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరు.

సంపుటము 34 { 1942 సం॥ జూన్ నెల 15వ తేది } సంచిక 3

## విషయములు



### చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రథమపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్పగిరి

౨ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౩ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౪ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు,
రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౫ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౬ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౭ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు,
హంపి.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు
జమీందారుగారు - దేవిడి

౩ కొండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బనవాపురము.

౪ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౫ చావలి నరసింహావధానులుగారు, బట్టలమిల్లు మేనేజరు,
సికిందాబాదు.

౬ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇమనూరు.

౭ వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు,
శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠము - బెజవాడ.

# అభినవసరస్వతి

సంపుటము 38 | చిత్రభాను సం॥ జ్యేష్ఠమాసము 1942 జూన్ 15 తేది | సంచిక 3

3

—• కృతివిమర్శము •—

**అమృతసందేశము.**

ఇది శ్లోకరూపమైనను తెనుఁగువివరణ మున్నది. రచయిత వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు. శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠాధిపతి; బెజవాడ. వీరు సప్తమాంధ్రాయుర్వేదసభ కగ్రాసనాధిపత్యము వహించిననాఁడు శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు చేసిన క్రింది

సీ. పండితవంశానఁ బ్రభవించినాఁడు, సం
పాదించినాఁ డసామాన్యగరిమ,
మనవైద్యమున పాశ్చాత్యవైద్యమునఁగూడ
హెచ్చుపరీక్షల నిచ్చినాఁడు,
కులవిద్య లాంగిలేయులవిద్యలనుకూడ
చవిచూచి సారంబు దవిలినాఁడు,
సభలలో నాయుఃప్రసక్తుల మాటాడ
నేర్చినాఁడు, యశంబు గూర్చినాఁడు,
అమృతశాస్త్రి, దయాళుండు విమలమతియు
దంటుసుబ్బావధాని సదస్యహృదయ
వేది నేఁటి యాయుర్వేదవేది నధిక
రించు టది దేశభాగ్యప్రపంచగరిమ.




అను నాశీర్వాదమునుబట్టి తదీయపాండిత్యాదులు విదితము కాఁగలవు. వీరు భామినీవిలాసమును తెనిఁగించినట్టును దాని ప్రశస్తియు నా వెంకటశాస్త్రిగారే వివరించియున్నారు. చూడుఁడు:

మ. ప్రకటింపంగదవయ్య నీ మృదుకవిత్వం, బేల యాలస్య మూ
రక కావించెదు? వైద్యరాజబిరుదభ్రాజిత్వ మట్లుండఁగా
సుకవీశానతకూడ నీకుఁ గలిగెన్ సుబ్బావధానీ! భవ
త్సుకులీనుల్ ప్రతిహారు పండితకవుల్, శుద్ధాత్మకుల్, కర్మఠుల్.

ఉ. భామినీవిలాసమేమి నీసుకృతం బ
యా మనీషి! కావ్యరామణీయ
కమ్ము చెడకయుండఁగాఁ దెల్గుచేసితి,
సంతసించినాఁడఁ జదివి చదివి.

వెంకటశాస్త్రిగారు వీరి పీఠమునుగూర్చికూడ

మ. కలలెల్లన్ నశియింప దర్శకశినాఁగా నున్న యీ దేశమం
దలి విజ్ఞానము భావికాలమున నాధారమ్ము చేకూరుచో
వెలయన్ విత్తనముల్ లభింపవని తద్బీజమ్ములన్ నిల్ప నీ
తెలుఁగుంబీఠము యత్నముల్ సలిపెడిన్ దీవింపు కామేశ్వరీ!

మ. కలికాలం బిది, భక్తియన్నను విరాగంబన్న విజ్ఞానపుం
గలనంబన్న నభస్సుమంబు లగుచుం గన్పట్టు నిప్పట్టునన్
కలిసంతారకుఁడైన వేంకటనగాగ్రస్థాయి సేవించు నీ
తెలుఁగుంబీఠ మదృష్టవంతమని నే దీవింతుఁ గామేశ్వరీ!

అని దీవించిరి. వీరే కాదు. ధర్మస్థాపక తర్క-వేదాంతవిద్యావిశారద ముది గొండ వెంకటరామశాస్త్రిగారును నపరిగ్రహీతలయ్యు నాపీఠమువిషయమై యెట్టి యభిప్రాయ మిచ్చినారో యీక్షింపుఁడు.

"ఈ...పీఠస్థాపకులగు శ్రీమ దమృతానందనాథస్వామివారి యమూల్యజీవన్ముక్తానందావస్థితిని బ్రత్యక్షముగఁ గాంచు భాగ్య మస్మదాదులకు లభింపక పోయినను దత్సంకల్ప పరిణామచిహ్నములై నట్టియుఁ జతుష్షష్టికలోద్ధరణాత్మకకార్య...రక్షణానుకూలురైనట్టియు...కాంచనపల్లి కవితాకల్పవల్లి కనకాంబామతల్లి...పీఠాధిపతి దంటు సుబ్బావధానులు...ధర్మమూర్తి వైశ్యకులావతంస శ్రీ రెడ్డిగారు మున్నగు తచ్ఛిష్యమహాశయుల యవ్యాజ ... భక్తి ... వలన ... ఊహించి కలికాలములో నిట్టి ధర్మావలంబనలాభమునకు గర్వించుచు నమందానందభాగ్యము నొందుచున్నాము"

ఈపీఠము ప్రధానోద్దేశ మిదియని శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారు వ్రాసిన క్రింది నివేదిక యాయన జ్ఞానము గురుభక్తి సహృదయము సుబోధము చేయఁగలిగెడిని.

"...సదాచారపరాయణులైనవారికి ... శాంతి లభింపఁజేయుం భగవద్భాగవత కైంకర్యము శ్రీ ... త్రిలింగమహావిద్యాపీఠము ముఖ్యోద్దేశము. వేదము ధర్మమూలము. స్మృతిపురాణేతిహాసములు దానియర్థము వివరించు ... సద్గురుపరంపర వేదార్థానుభూతి నుపదేశించు. గురూపదేశము లేని శాస్త్రకౌశలము సదాచారసంపత్తిలేని స్వచ్ఛందవృత్తి పరమార్థలబ్ధికి విరోధంబులు. లక్షేషు జ్ఞానవాక్ కోపి యన్నట్లు వైసిద్ధాంతములఁ బ్రమాణబుద్ధిగలవా రెందరో యుందరు. కాలవశమునఁ బ్రకయము న విశ్వమువలె నధర్మ విజృంభణమున భరతఖండము మునిఁగియున్నను గురుపరంపరమాత్రము ... తల పైకెత్తు

కొనియే యుండి త మన్నందినవారిఁ దమంతవారిఁ జేయుచుండును. విజ్ఞానమునకు జిజ్ఞాసువు లర్హులు. వేదశాస్త్రవిహిత ప్రవర్తనము ... పరమార్థప్రాప్తికి విరోధమనియు సాధునిక విశ్వాసోదరత్వబోధములు ... ప్రాపకంబులనియుఁ దలంచుట సమంజసము కాదు ... నేఁడు కొందఱు పడు దురభిప్రాయమున కెట్టి యవకాశము లేదు."

ఇఁక సుబ్బావధానులుగారి యమృతసందేశ మించుక యూఁదిగుఁ డిలకింతురు గాక. కవితయేమి సందేశమేమి యంతయు నమృతమే.

శ్లో. తదిదంపీఠ మాంధ్రాణాం జ్ఞానబీజప్రవర్ధకం
ఆచంద్రతారకం జీయా చ్ఛ్రీనివాసప్రసాదతః.
కాలోఽయం విషమః ప్రాప్తః, నో గురు ర్న చ దైవతం,
మహతాం బీజభూతానామపి యస్మి న్న జీవితం.
వేదశాస్త్రపురాణానాం వక్తా శ్రోతా చ దుర్లభః,
సత్యశౌచాదయో క్షీణా నిదాఘే సరితో యథా.
బ్రాహ్మణా వేదవిముఖా, శ్చాన్యే బ్రాహ్మణనిందకాః,
పురుషార్థో హ్యర్థకామౌ, పాండిత్యంతు ప్రతారణం.
పరప్రత్యయనేయత్వం పరధర్మానుశీలనం
ప్రజానాం ప్రవృత్తి రద్యాభూ, దాంధ్రాణాంచ విశేషతః.
యేనయేన విహీనా యే తత్తన్నిందంతి తేఽధమాః
పూర్ణానాం పాతనే సక్తాః ఖనిత్రాణి గిరీనివ.

వివరణ॥ ఎవని కేది లోపమో వాఁడు దాని నిందించును. ధనము విద్య రూపము లేనివారలు వాని నిందింతురు. గడ్డపలుగులు కొండలను గూలఁద్రోయఁ గడంగునట్లు వీరు పరిపూర్ణులను బడఁద్రోయఁ జూతురు.

శ్లో. పాతంజలఖసూచి ర్యో గ్రామ్యవాదే పతంజలిః,
లక్ష్యలక్షణహీనోప్యై నిర్యతిప్రాసకః కవిః.

వివ॥ పాతంజలమందు నాకసముఁ జూచువారు (వ్యాకరణమురానివారు) గ్రామ్య వాదమునం...దుఁ బతంజలులై యాచార్యత్వము వహింతురు. లక్ష్యలక్షణము లెఱుంగని గీతిగాండ్రందఱు యతియుం బ్రాసము లేక యేదే గతి మాత్రము నాశ్రయించి కవు లయ్యెదరు.

శ్లో. అనాచారరతా స్సర్వే హ్యవధూతపదే స్థితాః,
నియమార్గ శ్లథయం త్యేతే పరివారగణాప్తయే.

వి॥ అనాచారపరు...లందఱు నవధూతల ననుకరింతురు. స్నానసంధ్యాది నియమములను దొలఁగించుటచేఁ బెక్కుడు సౌకర్యమునకై యట్టివారి నాశ్రయింతురు.

శ్లో. విహాయాధికృతా న్స్నానం స్వీకుర్వం త్యనుయాయినః,
ఆకర్షణంతు సంఘస్య భ్రష్టానాం మోచనం కలౌ.

వి॥ విమర్శ చేయఁగల యధికారులను జెంతఁజేరనీయక గురువులు బనవన్నా పాలుదాగ్రవుదువా యనఁ దలఁచిగ్రష్టవారిని దరిఁజేర్చెదరు...వారలతఁ బదుగురఁ జెడఁ గొట్టుటయే పరమార్థము...

శ్లో. పురార్జితతపఃపుణ్యా సూ్సతాద్యా మునిపూజితాః
విప్రవిద్వేషిణో నైతే యథాద్య ప్రతిపాద్యతే.

వి॥ పూర్వపుణ్యవశమున సూతుఁడు మొదలగువారు మునులచేఁ బూజింపఁబడిరే కాని...బ్రాహ్మద్వేషులు కారు.

శ్లో. అహంకారపరా విప్రాన్ పరం నిందంతి పాదజాః,
జిజ్ఞాసవో న నిందంతి గురుసందర్శనోత్సుకాః.

అహంకారపరులైన శూద్రులు బ్రాహ్మణుల నిందింతురు. (జిజ్ఞాసువులు) ... నిందింపరు.

శ్లో. అద్యాపి సాధవ స్సంతి సర్వవర్ణేషు సాధకాః,
సిద్ధిమంతో న నిందంతి సర్వై స్సంపూజితాస్తు తే

ఇప్పటికైనను సర్వవర్ణములయందును సాధువు ... లున్నారు ... నిందింపరు. పైపెచ్చు వారెల్లరచేఁ బూజింపఁబడుచుందురు.

పత్రికలలో వ్యాసములు వ్రాయుటవలనఁ బ్రఖ్యాతిగడించినవారుఁ బరమార్థ మెఱుంగనివారు ... పెద్దలను సేవించనివారు ... కుకవులు రచించిన యసత్కావ్యము లను బఠించువారు సంస్కృత గంధమేని లేనివారుఁ బెద్దలతోడ విరుద్ధభావములు గలవారు సత్యదయాశౌచములు లేనివారు...క్రొత్తదారులు తీసి ప్రకటించుచుందురు.

శ్లో. విమర్శకా స్తే వివిధాగమానాం, విశోధకా స్సకలు శాస్త్రవాచాం,
విసూత్న శాస్త్రస్య విధాయకా స్తే విజ్ఞానసింహాసనసుప్రతిష్ఠాః.

వారే నేఁడు విజ్ఞానసింహాసనముల నధిష్ఠించి వేదములను విమర్శింతురు. శాస్త్ర ములను బరిశోధింతురు. క్రొత్తభాషాతత్త్వములను రచింతురు.

శ్లో. పాషండా నాస్తికా ధూర్తవంచితా బాలకా జడాః
నార్యోఽనార్యా స్తమోలీనాః ప్రజ్ఞావాదేషు సుస్థితాః.
సర్వధర్మాన్ పరిత్యజ్య స్వరాజ్యాయ కృతోద్యమాః
తాత్కాలికశుభావాప్త్యై త్వరమాణా గణే స్థితాః.
స్వచ్ఛందం సంచరంతోఽపి సంఘనామ్నా చరంత్యహో!
ఇత్థంభూతే జగజ్జాతే కింకార్యం ధర్మకాంక్షిభిః!

...పాషండులు ... నాస్తికులు ... పత్రికాప్రాచుర్యముఁ జూచి మోసపోయిన బాలకులు ... జనులు మదేకముగల స్త్రీలు నార్యసంప్రదాయమును ... వదలినవారుఁ దెలియనివిషయములను దెలిసినట్లు వాదించువారు ... సంఘములుగఁ జేరి ... స్వరాజ్యముకై యుద్యమించువారు ... యథేచ్ఛముగా సంచరించు ... వారు లోకప్రఖ్యాతి చెల్లుచున్నారు. ఇట్లు జగమంతయుఁ దాఱుమాఱుకాఁగా ధర్మము కాంక్షించువా రేమి చేయఁగలరు?

శ్లో. కలే రమోఘవీర్యత్వా ఛ్రుతికారో వృథాశ్రమః,
తద్విస్మృత్య తదస్పృష్టా యే కేచన మహోదయాః
తే ధీరా ధర్మరక్షార్థం తత్రతత్ర చరంతి వై,
తితీర్షూణాం తారయంత్యద్య నౌకా ఇవ మహోదధౌ

భగవన్నక్షత్రమాల

చం|| వ్రత జప దాన వేద సవవర్గ్యములం గనరాని నిన్ను మూ
ఢతఁ దనరారు గోపులు దిటంబుగఁ జిత్తమునందుఁ జేర్చి సం
తతముద మొందినారుగద తాపురసాక్షి! సమచ్ఛరణ్య! సం
తత శుభభక్తిగమ్యుఁడవు ధారుణి నేరికినైన నీవెగా.

ఇట్టిధారతో నిందలిపద్యము లిరువదియేడై నక్షత్రమాలగా నలరారెడిని. స్తుతిరూపమైన యీ భగవన్నక్షత్రమాలలోనే

చం|| శుచిజనగేయుఁ డాత్మ తనుశోధకుఁ డుజ్జ్వలమంత్రదాత సం
విచిత మహాసముజ్జ్వలుఁడును విశ్రుతభాష్యప్రదాత యజ్ఞతత్
రచితములైన దోషముల రక్షత నోర్చిన శాంతమూర్తి సం
రచిత భవత్కథావిధుల రక్షితచేతనుఁ డీక్షవృత్తుఁడున్

తే|| గీ|| మంజు వాగీతకులవార్ధి కంజరిపుఁడు
శ్రీజగన్నాథనామాద్య శిష్టయశుఁడు
మద్గురుం డురుతావక మహితదృష్టి
సంతతము సుఖియౌఁగాత సారసాక్ష!

అను పద్యముల ద్వారమున గ్రంథకర్తచే గురుస్మరణపూర్వక తచ్ఛ్రేయఃకామిత స్థిరపరుపఁబడినది. ఈకవి ముకుందమాలగ దెనిఁగించి మఱియు నాంధ్రమున నఖ్యాం దామస్తోత్రము, చిత్రమీమాంస, పితృస్మృతి రచించెను. వీరు శ్రీపత్తితాలూకాలోని ముక్తిపల్లెగ్రహారవాస్తవ్యులు తట్టా వీరరాఘవాచార్యులుగారు. తర్కపండితులుకనుక స్వప్రయోగముల సమర్థించుకొనుటలో సమర్థులైయుందురు. కాని యాంధ్రకవితాధార యింకనుగొంత సొంపు తేలవలసియుండునేమో యని తలంచెదను. మచ్చునకుఁ గొన్ని పద్యములు మాపిటసిగాన బడితకవులు పరికింపఁగలరు.

భాషావిదగ్ధులం గావించుచుండుటచే. ఏవిధానమునవలంబించి యత్యంతపరిజ్ఞాన ... ముతోఁ బరిశీలకతంత్రనిష్ణాతులై యసమాన ప్రతిభతో ... గౌరవింపఁబడుచు నధ్యాపకోత్తమపదవి నలంకరించిరో యావిధానముతోనే యుత్పత్తివిహీనులగు శిష్యులకైన నధ్యాపనము నొనర్చినచో స్వస్థానముల ఖాళీపఱచి వెడలునట్టి దుస్థితి దేశమునఁ బట్టి యుండునా? టీపార్టీలలో సౌకుమార్యసూచనకై పల్లెరములలో నుంచఁబడిన యల్పాల్ప భక్ష్యద్రవ్యములమాడ్కి నన్ని గ్రంథములలోని యల్పాల్పభాగములఁ బాశ్చాత్య విద్యానుకరణముతోఁ బాఠ్యములనుగా నేర్పఱచి ... వానిలోఁగూడ నతిసౌకుమార్య ప్రదర్శనమునకై యత్యల్పభాగములచే స్పృశించి యారగించు ... నాగరకంమన్యుల వలె నోట్సుభాగములను బ్రాచీనపరిశ్రములను మాత్రమే స్పృశించి పాఠ్యగ్రంథముల వంకఁగూడఁ జూడక పరీక్షకుల యనుగ్రహముతో నుత్తీర్ణతఁ బొంది ధన్యంమన్యులగువారిం జూచి యావిధానమునే శిష్యుల కోరిక ననుసరించి యవలంబించి బోధించుటయు నీదుర్గతికి ముఖ్యకారణమని యెంచవలసియుండును. కాకున్న నీవిధానము నవలంబించి మేమింతవారమైతిమని యెవరైనఁ జెప్పఁగలరా? కష్టపడుట కిష్టము లేకున్నను పూర్వాదృష్టవిశేషమున నష్టాపదము లభించిన దిష్టవంతుఁ డెచటనైన దృష్టిగోచరుఁడు కావచ్చును గాని యతికష్టసాధ్యములగు శాస్త్రవిద్యలలోని నిష్టదేవతానుగ్రహమునకైనఁ గష్టపడకుండ విద్వన్మణియైనవాఁ డెచటనైన దృష్టుఁడగునా? ... వినుకలి వాఙ్మయము కష్టసాధ్యమని యక్షరమాత్రజ్ఞానముకల బాలురకు స్వయముగ నర్థము చేసికొనుటకనువగు తేలికభాషతోనే గ్రంథముల రచించవలెనని యుద్బోధించుచును భావకవిత్వమను పేర నన్ని భాషానియమములకును దిలాంజలి నొసంగి ... పామర వాఙ్మయముతో సెంకిపాటలను మూసుపాటలను గొల్లసుద్దులు మున్నగువానిని ... కష్టపడి కూర్చి ... ముద్రింపఁజేయుచు నిదియే యాంధ్రభాషాభివృద్ధిమార్గమని ... బల్లగ్రుద్ది యుపన్యసించు భాషాతత్త్వవేత్తలకల యీరోజులలో వారివలన మృతభాషయను బిరుదము నందిన యమరభాషకుఁ గాని యందలి యార్షవిద్యలకుఁ గాని ... విలుప్తశేషకముగానున్న యాంధ్రదేశమునఁ దొల్లింటి యౌన్నత్యము లభించునను నాశ కవకాశము కాన్పించకున్నను ... ప్రకృత మీయుదరదరీపూరణదృష్టితోఁ బండితులేమి పామరులేమి మహాదేశమున స్వవిద్యల విడిచి శ్వవృత్తులకై శ్వవిద్యలను వానితో సమవిధానములనొందిన నామమాత్ర స్వవిద్యలను జేపట్టిరో యట్టి పొట్టకూటికిఁగూడఁ బట్టపరీక్షోత్తీర్ణులా శ్వవృత్తులు లభించక యిట్టట్టుఁ జూచుచు బిట్టుమొగములతోఁ జిట్టచివర కెట్టిచెయిదములనైనఁ బట్టుచుంట కళ్లెదుటఁ గాన్పించుచుంటఁ బట్టి కట్టా యిప్పుడైన నట్టి పట్టపములం గట్టిపెట్టి యెట్టులైన మన మెట్టువిద్యలు మట్టుపడకుండునట్టి పనులకై ... గట్టిపట్టుఁ బట్టునట్టు లాశ జెట్టి బుద్ధిఁబుట్టించు నేమోయను పుట్టెఁడాసతో మెట్టువారినుల కట్టె యంజలిఁబట్టుచుంటిని. ధార్మికచూడామణులకుఁగాని యార్షవిద్యాభిమానులకుఁ గాని కొఱతలేని మనదేశమున దివంగత విద్వన్మణిస్మారకచిహ్నముగ నట్టి యార్షవిద్యోద్ధారకసంస్థ.. నెలకొల్పఁబడునటు లాసర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక ...

---

### —♦ వసిష్ఠుఁడు శ్రీరామునకు జ్ఞానోపదేశ మొనర్చుట కియ్యకొనుట ♦—

చ. మునివర! నీదునాన తలమోయుదు సజ్జనులైనవారియా
జ్ఞను నెటువంటివారికినిఁ గాదన శక్యమె! కాన నేను రా
మునకును వానితమ్ములకు మూలతమం బడఁగింతుఁ దత్త్వబో
ధనమున నిద్ధదీధియు నుదగ్రతమిస్రముఁ బాపుచాడ్పునన్. 60

చ. అమలగుణాఢ్య! మున్ను నిషధాచలసానువునందు సంసృతి
భ్రమ ముడుపంగ మద్గురుఁడు పద్మభవుం డెవి నాకుఁ దెల్పె నా
విమలసుబోధ మిప్పుడు సవిస్తరతన్ మది సంస్మరింతు న
శ్రమమున నీకుసూరులకు సంశయమోహము శాంతిఁబొందఁగన్ 61

వ. ఇట్లు ప్రతిజ్ఞ యొనర్చి మహాజ్ఞానగరిష్ఠుం డగువసిష్ఠుండు శిష్యప్రబోధానురంజనోపాయం బగుదృష్టాంతోపాఖ్యాన ప్రమాణతర్కాదిపరికరబంధస్వీకారంబున వక్తృతేజస్సంపన్నుండై సకలజనాజ్ఞానశాంత్యర్థము పరమపదప్రాపకం బగుమోక్షశాస్త్రం బుపక్రమించుచు శ్రీరామున కిట్లనియె. 62

### — సదేహ విదేహముక్తుల తారతమ్యము —

తే.గీ. రామ! సృష్ట్యాది మును తామరసభవుండు
సర్వసంసార దుఃఖోపశాంతికొఱకు
నేప్రబోధంబు గావించె నిపుడు నేను
దాని వచియింతు విను సావధానముగను. 63

వ. అనిన రామచంద్రుం డిట్లనియె. 64

చ. అనఘ! క్షమింపవేఁడెద, మహాయతమై తగుమోక్షసంహితన్
వినుతువుగాని, నామది జనించిన యీచిఱుసందియంబు వే
గ నపనయింపు, మా శుకుని గన్న మహామతి సర్వవేది వ్యా
సునకు విదేహముక్తి యెటు చొప్పడదయ్యె? శుకుం డెటుల్ గనెన్? 65

వ. నావుడు వసిష్ఠభగవానుండు 66

చ. నలినహితప్రభాంతరమునన్ ద్రసరేణువు లెన్ని గల్గునో
యిలపయి నేరికొను గణియింపఁగ! నట్టులె చిత్ప్రకాశుఁడై
వెలిఁగెడి యాత్మయందుఁ బ్రభవించి వసించి లయించినట్టి యా
జలజభవాండజాలము లసంఖ్యము లౌనుజుమా కుమారకా! 67

ఆ.వె. మఱియు నిపుడు వర్తమానంబులై యున్న
కమలజాండకోటిగణము లెన్ని
గలవొ వాని లెక్క గావింప నెంతటి
వానికేని శక్యమానె! రామ! 68

తే.గీ. ఆత్మ యనెడు మహాంభోధి యంతరమున
లోకసృష్టులపేరి కల్లోలమాల
లెన్ని యింక మున్ను పొడమఁగానున్న వొక్క
వాని లెక్కించు టనుమాటగ్గునఁ గలదె! 69

వ. అనిన శ్రీరాముం డిట్లనియె. 70

ఆ.వె. వర్తమాన సృష్టివర్గ మసంఖ్యంబ
యగును గాని దేవ! యరసిచూడ
గడచినట్టిదానికంటెను రానున్న
దానికంటె నద్ది తక్కువెకద! 71

వ. అనవుడు వసిష్ఠుండు శ్రీరాముని దన నిగూఢాశయం బెఱింగిన వానిగా గ్రహించి తదీయబుద్ధికౌశల్యంబునకు సంతసించుచు నిట్లనియె. రామచంద్రా! యాకర్ణింపుము. దేవ మనుష్య పశు పక్ష్యాది ప్రాణి నికాయంబునం దేప్రాణి యేప్రదేశంబునం దెప్పుడు మృతినందు నాప్రత్యగాత్మ యాప్రదేశంబునంద యాక్షణంబ యాతివాహికనామకంబును వాసనామయంబును జిత్తాహంకార మనోబుద్ధి దశేంద్రియ ప్రాణఘటితంబును నగు సూక్ష్మశరీరంబుచేత నిజదహరాకాశంబునంద వాసనామయంబగు జగత్త్రయంబు గాంచి తత్తదనురూపజన్మాదు లనుభవించు నిదియెల్ల భ్రాంతిసంభవంబ కాని వాస్తవంబునఁ బ్రత్యగాత్మ జన్మాదివిక్రియారహితుం డగుచిదాకాశస్వరూపుండు. ఇట్లు 72

సీ. సంకల్పనిర్మితసౌధాదుల విధాన
మానసరాజ్యభ్రమంబుభంగి
ఇంద్రజాలోదితాహీంద్రంబు తెఱఁగునఁ
బఠితకథాప్రతిభాసముగతి.

పై త్యసంజనిత భూభ్రమణంబువడువున
సంత్రస్త శిశుపిశాచంబురీతి
నౌ యానగోచర నగయానమట్టులు
స్వప్న దృష్టపురంబుచందమునన

తే.గీ. తోఁచుజగదండములను మృతుండు తనదు
మనసులోననె తనయంత ననుభవించు,
భ్రాంతిజములయ్యు నివి చిరపరిచయమున
సత్యమట్టులె కలిగించుఁ బ్రత్యయంబు. 73

తే.గీ. ఈగతి మృతుండు తన చిన్నిహృదయమందె
వాసనామయలోకముల్ వడసి యందుఁ
గ్రమ్మఱం గిట్టె యట్టిలోకములె మరల
మరల గనుచుండు, నిదియ సంసరణసరణి. 74

వ. ఇట్లైనఁ గున. 75

తే.గీ. ఒక్క దేహంబునందు వేఱొక్కతనువు.
దాని నింకొక్క కాయంబు దాన మఱియు
నొకశరీరంబు నిటు లెన్నొ యొదిగియుండు
నరఁటికంబంబులోపలఁ బొరలభంగి. 76

వ. కావున మృతులగువారికిఁ బృథ్వ్యాది మహాభూతగణంబులుగాని జగత్క్రమంబులుగాని వాస్తవంబున లేవు. అట్లయ్యును మిథ్యానుభవంబునకుఁ గారణంబగు జగద్భ్రమంబు కలదు. ఇయ్యది యనంతయు నానాప్రసరశాలినియు సర్గతరంగమాలాకులయు నగు నవిద్యాతరంగిణి. అజ్ఞాను లిద్దాని దాఁటనోపరు 77

తే. ఈయవిద్య కధిష్ఠాన మై యొసంగు
నాత్మసాగరమున సృష్టులనెడి ఘులలు
ప్రాఁతవియుఁ గ్రొత్తవియుఁగూడఁ బలుమఱు పొడ
సూపుచుండును, నశియించుచుండు రామ! 78

తే. అట్టిచో రూపశీలాన్వయములఁ గొన్ని
పూర్ణసామ్యయుతంబులై పొల్చుఁ, గొన్ని

యర్థసామ్యయుతంబులై యమరుఁ, గొన్ని
యన్నిట విలక్షణంబులై యతిశయిల్లు. 79

తే. భారత పురాణములు వల్కి బ్రహ్మవిత్త
మున్నతింగన్న వ్యాస సర్గోద్యములందు
నితఁడు ముప్పదిరెండవయతఁ డటంచు
నామనంబున జ్ఞప్తి యున్నది కుమార! 80

వ. ఆ ముప్పదియిరువురు వ్యాసులందుఁ బన్నిద్దరు కులాకారచేష్టితంబుల సములై బ్రహ్మవిద్వరిష్ఠస్థానంబునఁ జిత్తవిశ్రాంతి నందనివారును, బదుగురు కేవల సమానాకారులును, దక్కంగలవారు కుల విచక్షణులునై తనరారిరి. రాఘవా! యింకను మఱికొందఱు వ్యాసులు వాల్మీకులు భృగువులు పులస్త్యులు నంగిరసులును జన్మింతురు. వారిలోఁ గొందఱు తొల్లింటివారితో సమానులును, గొందఱు వారికంటె నధికులుం గాఁగలరు. 81

తే. సురలు నరులును మఱి సురగ్షలు నొకప్డు
కలిసియు నొకప్డు వేర్వేఱుగాను బెక్కు
మాఱు లుదయించుచుండుగు మడియుచుండు
రట్టియెడ భేదములు గాన నగును గొన్ని. 82

తే. అమలగుణ! బ్రహ్మకల్పంబునందు దెబ్బ
దియును రెండును నయిన యీ త్రేత పూర్వ
కల్పములఁ బెక్కుమాఱులు గడచె, భావి
కల్పములఁ బెక్కుమార్లు రాఁగలదు మరల. 83

క. ఈవిధి జగములు నేనును
నీవును జనియించితిమి, జనింపంగల మె
న్నో వారములు మరల, నే
నీవృత్తాంతమ్ము నెల్ల నెఱుఁగుదును జుమీ. 84

క. పదియవ యవతారమును
విమ్మది యద్భుతకర్ముఁడైన యీ వ్యాసున కీ
విదితాత్మతోడఁ బలుమా
ఉదయించితి మేను నాకుజోర్వీసురఁడుఁ 85

# ఇల్లాలు

## ఆఱవ భాగము



### పాతివ్రత్యము

కం. నిత్యసుఖ మిచ్చు పాతి
  వ్రత్యము ఫలం బిడు సకలవ్రతముల ఫలసాం
  గత్యముఁ గల నిడఁ బాతి
  వ్రత్యమునకు నెనయె స్త్రీల గౌరవప్రకటనమై.

పావనమగు వివాహసంబంధమును మీఱి వ్యాపించు నాంతరంగికౌత్సుక్యము నణఁచుకొను సామర్థ్యము పాతివ్రత్య మనఁబడును. ఈసామర్థ్యముగల పురుషుఁ డేకపత్నీవ్రతనియమముగల వాఁడును స్త్రీ పతివ్రతయు నగును.

ఈనియమముగలవారి హృదయములు నిష్కల్మషములుగను శరీరమెల్ల వికాస భాసురంబుగను నుండును. పాతివ్రత్యతుల్యాలంకార మొండు లేదు.

పాతివ్రత్యము కురూపులనైన ప్రకాశమానులఁ జేయఁగలదన రూపవంతుల నది యెట్లు భాసమానులఁ గావించునని వర్ణింప నెవరితరము? సుగుణసంపత్తిచే నలంకరించు కొనువారితో సమానముగ నట్టి గుణసంపత్తిలేనివా రెంత స్ఫురద్రూపముగలవారయ్యుఁ బ్రకాశింపఁజాలరు. అని యుపన్యాసమంజరినుండి కృష్ణాబాయి చదువునప్పటికి జగదంబ సమీపమునఁ గూర్చుండెను).

జగ:— ఈదిన మేవిషయముం గూర్చి చదువుచున్నావు?

కృష్ణా:— మఱేమియు లేదు. మన యుపన్యాసమంజరినుండి నేఁటిదినము పాతివ్రత్యముం గూర్చి చదువవలెనని ప్రారంభించినాను.

జగ:— ఏది! చదువు - కొంచెముసేపు నేనును వినెదను.

కృష్ణా:- (పైమూడువాక్యములు మరలఁ జదివి యనంతరమున) అతివ్యాప్తి పాతివ్రత్యనియమమునకు హానికరమని పెద్దలు నుడివియున్నారు. ఋతుకాలము గాకుండినను నిషిద్ధతిథివారనక్షత్రములందును భార్యాభర్తల సాంగత్యము వ్యభిచారతుల్యము. కామాధిక్యకారకములగు క్రియాకలాపము లతినింద్యములు. ఆరోగ్యకాములు మితాహారమును గొనునట్లాయుర్వృద్ధికాములు సంతానప్రాప్తిగోరువారు మితసాంగత్య మొనరించవలెను. శరీరము లుపవాసవ్రతముచేఁ బావనమగునట్లు నియతకాల పృథక్శయ్యలచే దాంపత్యము పవిత్రీకృతమగును.

దుర్వ్యసనములచే ధనమెల్లఁ గోల్పోయినవారు బుద్ధి తెచ్చుకొని స్వప్రయత్నములచే నష్టమైనదానిని బూరించ నవకాశము కలుగవచ్చుం గాని సాంగత్యదుర్వినియోగముచే బలారోగ్యాయుర్వ్యయము గావించుకొనినవా రాజన్మమున నవి మరల బడయఁజాలరు, గాన యువతు లెల్లరీవిషయము మున్ముగా నెఱిఁగి యుండుట యావశ్యకము. పురుషుల సచ్చరిత్రము వారికి మాత్రము పావనత గూర్చుచుండును. స్త్రీయొక్క సచ్చరిత్రము కుటుంబమున కెల్లఁ బావనత గూర్పఁగలదు. పతివ్రతల మనం బెల్లప్పుడు జ్ఞానభాసురంబై యుండును.

చ. మనసు నెఱింగి వర్తిలుచు మాఱువచింపక యొగ్గులాడక యుం
డినపని నిర్వహించుచును నేర్పుమెయిన్ హితమైన ముచ్చటల్
వినిచి సకాలభోజనము పెట్టి విడెంబిడి విశ్రమింపఁగా
పెనిమిటి పాదసేవయును బ్రీతిఁ బతివ్రత సేయు నిత్యమున్.

ముఖమందు శాంతరసమును మాటలయందు జ్ఞానమును బ్రవర్తనమం దడఁకువయు శ్రమయం దోర్పును గల నెలఁత పతివ్రతయై యుభయవంశముల నుద్ధరించఁగలదు.

గంగానది పవిత్రతకంటెను గీతామృతపావనత్వముకంటెను బతివ్రత మహిమ గౌరవపాత్రమైనది. పవనపర్ణాంబుభక్షులై యరణ్యముల నొంటిగ నివసించుచుఁ దపం బొనరించు మునీశ్వరులకంటెఁ బతివ్రత లధికమాహాత్మ్యము కలిగియుండఁగలరని చెప్పిన నది యతిశయోక్తి కాఁజాలదు. వారు స్వయంప్రకాశమానలై యుందురు.

అత్రిభార్యయగు "అనసూయ" త్రిమూర్తులను బాలురం గావించి చిరకాలము తనయింట నుంచెను. ఆమెకు యోగమహిమ తెలియదు. తపస్విని కాదు. క్షేత్రయాత్ర లొనరించియుండలేదు. దైవభక్తి యలవడలేదు. అణిమాది సిద్ధుల నెఱుఁగదు. "పాతివ్రత్య" మహిమ యొక్కటియే యామె కష్టసిద్ధుల నొసఁగూర్పఁగలిగియుండెను.

సావిత్రి తన పాతివ్రత్యమహిమచేఁ బెనిమిటిని బునర్జీవితుఁ గావించి మామ కన్నులను, బోయిన రాజ్యమును దిరిగి లభించునట్లొనరించఁగలిగెను. ...
(ఇంతవఱకును విని)

జగ:- ఇటువంటివా రిప్పు డెవరయిన నున్నారా?

కృష్ణా:- లేకయుందురా! పుణ్యవతుల మగుదుమేని వారిని మనము గుర్తింపఁగలము. ఖనికుఁడు వజ్రము దెలిసికొనఁగలుగునట్లు జ్ఞానులు మాత్రమే పతివ్రతల గుర్తించఁగలరు. ఇది యనుభవమున [illegible] బోధపడఁగలది కాదు. పాతివ్రత్యము కలవారి ముఖము సూర్యబింబము వలెఁ గళకళలాడుచుండును.

పతివ్రతకు భర్త దైవసమానుఁడు. ఆమె సాధులకు సంప్రీతిదాయిని. దుష్టులకు భయప్రద. కుటుంబమున కమృతసేచనము. భర్తకు మనోహరాకారము. నక్షత్రరాశిం గలిసియుండియుఁ గురుశుక్రులు స్వప్రకాశములచేఁ జూచువారి దృష్టుల నలరించునట్లు జనసామాన్యముం గలిసియుండియుఁ బతివ్రతలు తమ్ముఁ దెలియఁగలవారి మనంబుల నలరఁజేయుచుందురు. లజ్జయు నొద్దికయుఁ గలిగి నిర్వ్యాజమగు పతిభక్తితోఁ గూడిన శాంతరూపము పతివ్రతాలక్షణమై ప్రకాశమానమగు జ్యోతివలె నలరుచుండును.

జగ:- అట్టుండెడివారు నాకెవరుఁ గనుపించుటలేదు.

కృష్ణా:- ఇట్టివారు లేకపోరు. వారిని గుర్తించుటకు మనవంటివారలకుఁ జేతఁగాదు. పతివ్రతలను జ్ఞానులే గుర్తింపఁగలరు. ఆకసమందుఁగల నక్షత్రము లన్నిటిలో జ్యోతిశ్శాస్త్రము నెఱిఁగినవారుమాత్రము గ్రహములను దారలను వాని గమనములను దెలిసికొనఁగలిగినట్లు మహాజనమున నొప్పు పతివ్రతలను జ్ఞానులే తెలిసికొనఁగలరు. మన మెఱుఁగఁజాలనంతమాత్రమున నట్టివారు లేరనుకొనుట కాదు. ఏకదార్థముయొక్క నిజస్థితి తెలిసికొనుటకును గొంత పాండిత్య మవసరము- మాటలే మంత్రములు- చెట్లే శుద్ధక్రియలు- ఏపుట్టయం దేపామున్నదో మన మెట్లు గ్రహించఁగలము? ఏవిషయమేని యెఱిఁగినవారి కది కరతలామలకము. ఎఱుఁగనివారి కగమ్యగోచరము. మన మీ రెండవతరగతిలోఁ జేరినవారము. తెలిసికొనలేని లోపము మనయందుంచుకొని విషయము నెఱిఁగినవారిని నిందించుచు నది నిజముకాదని తలంచుట యజ్ఞత.

జగ:- విన్నమాటలు నిజమో యబద్ధమో యని తెలిసికొనుటకుఁగూడఁ దెలివి కావలెనటే- నీమాట విన్నకొలఁది వింతగా నుండుచున్నది.

కృష్ణా:- పండితులకును మనకును భేదమేమిటి? పంచేంద్రియవ్యాపారములచే నందఱము గ్రహింపఁగల పదార్థతత్త్వములు వారెఱుఁగుదురు- మన మెఱుఁగము- అంతకంటెను మనకును వారికిని భేద మింకేమియు లేదు. అవి యెఱిఁగినవారు జ్ఞానులై మన మేలుకొఱకు ననేకనియమముల నొనర్చియున్నారు. పసిపిల్లల కపరములగు నాహారాదులకు గనిపెట్టి మనము సిద్ధపఱచి వినిపించి తినిపించులాగున లోక మందఱిని దమ సంతానమువలెఁ దలంచుచుండిన మన పూర్వ ఋషులు మన మెఱుఁగఁజాలని కారణములు గల నియమము లేర్పఱచియున్నారు. మన మామార్గముల వర్తించి సుఖించుచున్నాము. తప్పుత్రోవల నడచువారిని రాళ్లు ముళ్ళు బాధించునట్లు ఋషిప్రోక్తమార్గముల మీఱి నడచువారికి విపత్తులు తటస్థించి బాధించుచుండును.

జగ:- సరే- బాగుగనే యున్నది. ఏది వినఁబోయినను నగాధముగానే యున్నదే — మన కేమియుఁ దెలియదనియు మనచేత నేమియుఁ గాదనియుఁ గనుకను మూరకుండుట బాగుగానుండునట్టున్నది. నీమాటలకు నేనేమియుఁ జెప్పలేనప్పు

కృష్ణా:-మన జీవితకాల మతిస్వల్పము. లోకవ్యాప్తియం దనేకసహస్రసంవత్సరములు గతించినవి. మనవంటివారు కోట్లుకోట్లుగ జన్మించి తమ తనుయాత్రలు గడిపి చనియున్నారు. పుణ్యపురుషులు లోకోపకారకములగు నియమములు క్రియలు వ్యాపింపఁజేసి పోయినారు. మనము వాని ననుసరించి మేలునందుచు మనకాలము గడపుకొనవలెను. అంతియె గాని సర్వమును సహేతుకముగ నెఱుఁగుటకు మనకే కా దెవరికిని వశముకాదు. ఎంతమహాపండితునికిని నొకవిషయము సమగ్రముగఁ దెలియుట దుర్లభము.

మహానుభావు లెఱిఁగి వ్యాపింపఁజేయు సదాచారము లుత్తరకాలమున లోకవ్యాప్తి నందఁగలవు.

స్త్రీలు శరీరబలమందును బుద్ధిబలమందును బురుషులకంటెఁ దక్కువ. కావు ననే వారి నబలలని భీరువులని వాడుదురు. వారలు తమ పాతివ్రత్యశక్తిచేత లోకమెల్ల వశపడఁ జేసికొనఁగలరు. పురుషలోకమెల్ల గడగడ వడఁకునట్లు చేయఁగలరు భర్తల కొదవిన యాపదల నివారించుట కెట్టిభయంకరకార్యములనైనఁ జేయఁగలరు. ఒంటిగ నంధకారమున నేగుటకుఁ గాని యెట్టికష్టమునైన నోర్చుటకుఁ గాని తెగఁబడి యుద్ధము చేయుటకుఁగాని వారు వెనుదీయరు.

జగ:-ఆడజన్మ మెత్తి యింతంత పనులు చేయుదురన్న వింతగానున్నది. ఎన్నడు వినలేదు. చూడలేదు.

కృష్ణా:-ఇట్టి యద్భుతములు దినదినమునఁగాని దేశ మెల్లెడలఁ గాని జరుగవు. కాలాంతరములందు దేశాంతరముల సంభవించిన విషయములఁ జరిత్రలమూలమునను వర్తమానపత్రికల మూలమునను మనము తెలిసికొనవలెను. కలకత్తా సమీపమున నిటీవల జరిగిన యొకవిషయము నేను వినియున్నాను. చెప్పెద నాకర్ణింపుఁడు.

“ఒక చిన్న జమీందారు భార్యాసహితముగ నంతఃపురమునఁ బరుండియుండఁగ రాత్రి రెండుజాములవేళ నాయింటి కిన్నూఱు మున్నూఱు బందిపోటు దొంగ లాయుధపాణులై యరుదెంచి కావలివారల నెల్ల సంహరించిరి. కాని వెలుపల నేమియు వారికి వెలగల సామగ్రిగాని ధనముగాని లభించనందున వీరు పరున్న గది తలుపులు బ్రద్దలుకొట్ట నారంభించిరి. ఆగదియం దొక కత్తి తప్ప మఱేమియు లేదు. ఇంట జరుగుచుండిన ఘోరకృత్యమును వీరు మొదటనే యెఱిఁగిరిగాని తలుపుదీసినఁ బ్రాణభంగమగునని భయభ్రాంతులై మిన్నకుండిరి. వారు పరున్న గది తలుపు పగులఁగొట్ట నారంభించఁగనె జమీందారు గడగడ వడఁకుచు మంచముక్రింద దూఱెను. ఆయన భార్య యొరనుండి కత్తిదీసి చేతఁ బూని సిద్ధముగ నిలిచెను. తలుపునకుఁ జేయిపట్టెడు కంత పడఁగనె చోరుఁడు గడియ తీయుటకుఁ జేయి లోపలికి సాఁచెను. ఆ జమీందారు నిల్లాలు రెప్పపాటునఁ జేయి ఖండించెను. వారు లోపలికిఁ దుపాకులు కాల్చిరి. కాని గుండ్లు

## శంకరభగవత్పాదుల జననాది సమయములు

చరిత్రవిదులమని యింగ్లండులో వ్రాయుచున్నారు. ఇంతబహుత్వము మీఁద నిదమిత్థమని నిర్ణయించుట యశక్యమైనపనియే కాని యైనను నేను నొకత్రోవ ద్రొక్కెదను. ఆంగ్లేయులును దద్వేషభాషావలంబులును జెప్పెడి యంశము లన్నియుం సనాతనధర్మవిరుద్ధములు. సనాతనధర్మము శ్రుతిస్మృతిపురాణేతిహాసములపైననే యాధారపడియున్నది. పూర్వోక్తు లవ్వాని భ్రాంతిగా నమ్మరు. శ్రుతులలోఁగల యర్థమునే స్మృతిపురాణాదులు విపులీకరించినవి కాని స్వతంత్రములు కానే కావు. ఆశ్రుతు లనాదులు. అపౌరుషేయములు. అట్టి శ్రుతు లీనడుమ నెప్పుడో యెవరి చేతనో వ్రాయఁబడినవని కాలనిర్ణయము చేయుం ఘనులు పూర్వోక్తు లందఱును. అంతే గాదు. మహానుభావులైన బ్రహ్మర్షులకును రాజర్షులకును క్షత్రియచక్రవర్తులకును నివాసభూతమైన భరతఖండమున నార్యులే మొదట లేరనియుం నెక్కడనుండియో యిక్కడ కిటీవల వచ్చిరనియు నీపూర్వోక్తులు తెగవ్రాయుదురు. అట్టివారి వ్రాఁత లస్మదాదుల కవిశ్వాస్యములు. శంకరాచార్యు లిటీవల నెప్పుడో జన్మించిరనువా రందఱును నీరే. వీరి కీయంశమును దెచ్చి క్రీ. శకములోఁ జొన్పుట పరిపాటి. కనుక నవ్వారి వ్రాఁత లన్నియుం నటుంచి వేదవ్యాసుల యభిప్రాయ మొకటి తీసికొంటిమేని శంకరాచార్యకాలము స్పష్టముగా మనకుఁ దెలియఁగలదు. ఆయన వేదవిభాగకర్త. అష్టాదశపురాణకారుఁడు. కాలత్రయవేది. కనుకనే భవిష్యద్విషయములఁ గూడ బాగుగా నాయనయే నిర్ణయించియున్నవాఁడు. శ్లో. కల్యాదిమే మహాదేవి సహస్రద్వితయాత్పర మని శంకరాచార్యావతారము కలియుగము 2, 3 వేల నడుమనైనట్లు నుడివియున్నాఁడు. పైన వివరింపఁబడిన పలువుర యభిప్రాయములలో 31, 32 ఈద్విత్రిసహస్ర మధ్యమందలి కాలమును గట్టిచేయుచున్నది.

శ్లో. తిష్యే ప్రయాత్యనలశేవధిబాణనేత్రే
యో నందనే దినమణా వుదగధ్వభాజి
రాధే దితే రుడువినిర్గతమంగలగ్నే
ప్యాహూతవాన్ శివగురుస్సచ శంకరేతి.

అని ప్రాచీనశంకరవిజయము కలి 2593 నందన సం॥ వైశాఖ శుక్ల పంచమీ భాను వాసరము పునర్వసునక్షత్రము ధనుర్లగ్నమున నైన శ్రీ శంకరాచార్యావతారమును స్పష్టపఱచుచున్నది.

ఇట్లే నాకు లభించిన ప్రమాణములను బట్టి శంకరాచార్యుల జననాది సమయ పరిష్కార మంతయు నలుపుచున్నవాఁడను. అది యుధిష్ఠిరశకము ననుసరించి యుండెడిని. కలి ప్రారంభమునకు యుధిష్ఠిరశకము 37 సం॥ లకు ముం దారబ్ధము.

యు॥ శ. 2631 నందన సం॥ వైశాఖ శు ౫ శ్రీ శంకరాచార్యుల యవతారము.
2636 చైత్ర శు ౯ ఉపనయనము
2639 కార్తిక శు ౧౧ చతుర్థాశ్రమస్వీకారము
2640 ఫాల్గున శు ౨ గోవిందయోగీంద్రుల యుపదేశము - తదాది

2646 పర్యంతము బదరికాశ్రమమున షోడశభాష్యప్రణయనము నారాయణ ప్రతిష్ఠ జ్యోతిర్మఠనిర్మాణము.
2647 కార్తిక శు ౫ వ్యాసులతోఁ గాశిలో బ్రహ్మసూత్రభాష్యప్రచారము, పద్మపాదునితోడి సమాగమము.
మార్గశిర బ 3 మండనమిశ్రునితోడి వివాదారంభము.
2648 చైత్ర శు ౪ మండనుని పరాజయము.
౬ సరస్వతితోడి కలాప్రసంగము.
బ ౫ అమరుకదేహప్రవేశము
కార్తిక శు ౧౩ మరల నిజదేహప్రవేశము.
బ ౧ ఆకాశమార్గమున బ్రహ్మలోకమునకుఁ బోవు నా సరస్వతిని చింతామణిమంత్రముచే ద్వారావతి కాక ట్టించుట.
౮ అక్కడ శారదను స్థాపించుట.
౧౩ మొదలు
మాఘ శు ౧౦ పర్యంతము నా ద్వారావతిని శారదాపీఠనిర్మాణము, బౌద్ధాది పరాజయము, రుద్రమాలాకారముతో భగవదాలయనిర్మాణము, యాదవేంద్రప్రతిష్ఠ, సిద్ధేశ్వర మందిరనిర్మాణము, భద్రకాళి యంత్రోద్ధారము.
ఫాల్గున శు ౭ మొదలు శృంగగిరిని మఠస్థాపనము.
2649 చైత్ర శు ౭ మండనమిశ్రుని యుత్తమాశ్రమదీక్ష, సురేశ్వరాచార్యులని యోగపట్ట నొందుట.
మార్గశిర శు ౧౦ సుధన్వుని శిష్యునిగా గ్రహించుట.
మాఘ శు ౨ సురేశ్వరాచార్యులను శారదాపీఠమున నభిషేకించుట.
2650 వైశాఖ శు 3 మొదలుకొని దిగ్విజయమునకు బయలుదేఱుట.
53 శ్రావణ శు ౨ తోటకాచార్యుని శిష్యునిగాఁ జేర్చికొనుట.
54 ఆశ్వయుజ శు ౧౧ హస్తామలకుని శిష్యునిగా గ్రహించుట.
పుష్య శు ౧౮ ఆయన పీఠాభిషేచనము, ఆదినమే తోటకాచార్యు నకును
55 వైశాఖ శు ౧౦ దిగ్విజయమధ్యఁ బురుషోత్తమక్షేత్రమునకుఁ బోవుట, అక్కడఁ గోవర్ధనజగన్నాథప్రతిష్ఠాపనము, గోవర్ధనమఠస్థాపనము, పద్మపాదు నభిషేచనము.
భాద్రపద శు ౧౮ మొదలుకొని
62 పుష్య శు ౧౮ పర్యంతము నవిచ్ఛిన్నదిగ్విజయము, బౌద్ధాది ద్వాత్రింశదుత్తరైకసహస్ర (1032) మతముల ఖండనము, సుధన్వుఁడు మొదలగు రాజులను జక్కఁగాఁ బ్రజాపాలనము చేయుఁడని యాజ్ఞాపించుట, అనాదివర్ణాశ్రమవిహిత వైదికధర్మమర్యాదావ్యవస్థాపనము,

నిఖిలయోగమాహాత్మ్యప్రకటనము, అశేషజనరంజనము, ఇట్లు భూలోక సముద్ధారము, తరువాతఁ గాశ్మీరమండలమున శారదాపీఠవాసము.

2663 కార్తిక శు ౧౫ శ్రీశంకరాచార్య కైలాసగమనము.

ఇట్లు బదరీ ద్వారకా జగన్నాథ శృంగగిరుల నాలుగింటనే నాలుగుపీఠము లేర్పఱచెనని కొందఱును గామకోటిపీఠమని కాంచీపట్టణమున నైదవపీఠముకూడ స్థాపించెనని కొందఱును జెప్పుచున్నవారు. ఈ ద్వైవిధ్యము కాశీ కలకత్తా విజయనగర హరిద్వారాది పట్టణ సంస్థానములతోను దక్షిణ మహావిద్వాంసులతోను యతిసహస్రములతోను సంబంధించియున్నది. శృంగగిర్యాదిపీఠములతోపాటు కాంచీకామకోటిపీఠమును భరతఖండమునఁ బ్రసిద్ధమై భాసిలుచున్నవి. తచ్ఛృంగగిర్యాది పీఠగురుపరంపరలవలెనే యీ కామకోటిపీఠ గురుపరంపరయుఁ గామపించుచున్నది. శ్రీశంకరాచార్యులు మొదలుగా 66 వ పురుషులగు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వాములవారు ప్రకృత మా కామకోటి జగద్గురుపీఠము నధిష్ఠించి కాలుచున్నవారు. వీరు పండితులు. శాంతులు. తపస్వులు ధీరులు. వదాన్యులు. ఉచితజ్ఞులు. సర్వవిధములను శ్లాఘాపాత్రులు. ప్రజలను స్వకీయోపన్యాసములచేతనే కాక స్వప్రవర్తనచేఁగూడ సత్పథమునకు లాగఁగల సర్వోత్తములు. అట్టివారగుటచేతనే యీ సేతుశీతాచలముఁ గల యుపనీజనముఁ బీఠగౌరవమునుగూడ మించిన వ్యక్తిగౌరవము వీరియందుఁ బెట్టుకొనియున్నది.

శంకరభగవత్పాదు లిట్లు సర్వదుర్వాదులను శాసించి వర్ణాశ్రమధర్మవ్యవస్థాపనమునకై పీఠములను స్థాపించుటయే కాక వివిధగ్రంథములు విరచించిరి. అందుపనిషత్తులకును బ్రహ్మసూత్రములకును భగవద్గీతలకును లలితాత్రిశతి విష్ణుసహస్రనామములకును సనత్సుజాతీయాధ్యాత్మపటలములకును హస్తామలకీయమునకును గాయత్రికిని భాష్యములు.

1 ఉపదేశసాహస్రి (గద్యపద్యాత్మక) 2 వివేకచూడామణి 3 ప్రపంచసారము 4 మహావాక్యదర్పణము 5 అపరోక్షానుభూతి 6 శతశ్లోకి 7 ప్రబోధసుధాకరము 8 వేదాంతసారము 9 వేదాంతడిండిమము 10 సదాచారము 11 వాక్యవృత్తి 12 ఆత్మబోధ 13 ఆత్మానాత్మవివేకము 14 ఆత్మచింతనము 15 హరిమీడేస్తుతి 16 విజ్ఞాననౌక 17 యోగతారావళి 18 స్వాత్మానందప్రకాశము 19 జీవన్ముక్తానందలహరి 20 శివానందలహరి 21 సౌందర్యలహరి 22 ప్రశ్నోత్తర రత్నమాల 23 పంచీకరణము 24 రాజయోగము 25 బ్రహ్మవిద్యావిలాసము (పంచదశీవ్యాఖ్య) 26 సిద్ధాంతబిందువు (దశశ్లోకి) 27 రామకర్ణామృతము 28 అద్వైతానుభూతి 29 అనాత్మశ్రీవిగర్హణము 30 స్వరూపానుసంధానము 31 మాయాపంచకము 32 ప్రౌఢానుభూతి 33 బ్రహ్మజ్ఞానావళీమాల 34 లఘువాక్యవృత్తి 35 నిర్వాణమంజరి 36 బ్రహ్మానుచింతనము 37 తత్త్వోపదేశము 38 లఘువాక్యవృత్తి, ఇవి ప్రకరణములు.

సామాన్యగ్రంథములు—

1 భజగోవిందస్తుతి 2 లక్ష్మీనరసింహస్తోత్రము 3 కనకధారాస్తుతి 4 కాశీసారము 5 కృష్ణాష్టకము 6 గోవిందాష్టకము 7 కాలభైరవాష్టకము 8 దశావతార

స్తుతి 9 పంచమహాయుధస్తోత్రము 10 త్రిపురసుందరీమానసపూజ 11 త్రిపురసుందరీ చతుష్షష్ట్యుపచారపూజ 12 ఆత్మానందాష్టకము 13 నవరత్నమాలికాస్తోత్రము 14 మహావాక్యస్తోత్రము 15 శివపంచాక్షరపంచకము 16 అర్ధనారీశ్వరగంగాధరాష్టకము 17 బ్రహ్మనామావళి 18 స్వరూపానుసంధానస్తోత్రము 19 యతిపంచకము 20 జీవబ్రహ్మైక్యస్తోత్రము 21 దక్షిణామూర్త్యష్టకము 22 శివమానసపూజ 23 మానసపూజాప్రకారాష్టకము 24 విశ్వనాథనగర్యష్టకము 25 అన్నపూర్ణాష్టకము 26 మణికర్ణికాష్టకము 27 నిర్వాణషట్కము 28 కృష్ణాష్టకము 29 శ్రీరామభుజంగము 30 శివభుజంగస్తోత్రము 31 సుబ్రహ్మణ్యభుజంగస్తోత్రము 32 అంబాష్టకము 33 విష్ణుపాదస్తుతి 34 భవానీస్తోత్రము 35 పాండురంగాష్టకము 36 అచ్యుతాష్టకము 37 షట్పది 38 ఆత్మపంచకము 39 కౌపీనపంచకము 40 వైరాగ్యపంచకము 41 మనీషాపంచకము 42 సాధనపంచకము 43 ఏకశ్లోకి 44 దత్తాత్రేయసహస్రనామావళి 45 జగన్నాథాష్టకము 46 యమునాష్టకము 47 నర్మదాష్టకము 48 గంగాష్టకము 49 కామాక్ష్యష్టకము 50 శివరామాష్టకము 51 శారదాస్తుతి 52 విఠలస్తోత్రము 52 త్రివేణీస్తవము 54 యమునాభుజంగస్తోత్రము 55 హనుమత్పంచరత్నము 56 లక్ష్మీనరసింహపంచరత్నము 57 విష్ణుభుజంగస్తోత్రము 58 మీనాక్షీపంచరత్నము 59 మీనాక్ష్యష్టకము 60 నిర్గుణమానసపూజ 61 భ్రమరాంబాష్టకము 62 శివపంచాక్షరనక్షత్రమాల 63 ద్వాదశలింగస్తోత్రము 64 అర్ధనారీశ్వరస్తోత్రము 65 శారదాభుజంగప్రయాతము 66 కాశీపంచకము 67 గణేశపంచరత్నము 68 గణేశభుజంగస్తోత్రము 69 శివపాదాదిస్తుతి 70 వేదసారశివస్తోత్రము 71 సువర్ణమాలాస్తుతి 72 భగవన్మానసపూజ 73 మృత్యుంజయమానసికపూజ మొదలైనవి.

వేల గ్రంథము లిట్లు విరచించి యాచంద్రార్కము, ఆస్తికజనము తరింప నవనిపై వెదజల్లిరి. అట్టి శివావతారమగు శ్రీశంకరభగవత్పాదు నంతేవాసులు గూడ నట్లే యభినుతించిరి. చూడుడు.

శ్లో. విదితాఖిలశాస్త్ర సుధాజలధే! మహితోపనిషత్కథితార్థనిధే!
హృదయే కలయే విమలం చరణం భవ శంకర దేశిక! మే శరణం.
కరుణావరుణాలయ! పాలయ మాం భవసాగరదుఃఖవిదూనహృదం
రచితాఖిలదర్శన! తత్త్వవిదం భవ శంకర దేశిక! మే శరణం.
భవతా జనతా మహితా భవితా నిజబోధవిచారణచారుమతే!
కలయేశ్వరజీవ వివేకవిదం భవ శంకర దేశిక! మే శరణం.
భవఏవ భవానితి మే నితరాం సమజాయత చేతసి కౌతుకితా
మమ వారయ మోహమహాజలధిం భవ శంకర దేశిక! మే శరణం.
సుకృతేధికృతే బహుధా భవతా భవితా పదదర్శనలాలసతా
అతిదీన మిమం పరిపాలయ మాం భవ శంకర దేశిక! మే శరణం.

# సహాయులు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.

౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల.

౪ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు, శాతాపురము.

౫ రాయచూరి బండేరావుగారు, అయినాపురము.

౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.

౭ చిక్కారాజు మట్టపల్లిరావుగారు - చెలకుర్తి.

౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు [illegible]

౯ అద్దంకి ... తిరువేంగడతాత దేశికాచార్యులయ్యవార్లంగారు. తక్కెళ్ళపాడు

౧౦ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.

౧౧ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.

౧౨ కురికాల వెంకటేశ్వరరావు దేశముఖుగారు, పులిగెళ్ళ.

౧౩ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.

౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.

౧౫ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి

౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణికాలరీసు.

౧౭ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖుగార్లు కాకర్లపల్లి,

౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.

౧౯ మద్దూరి సాంబయ్యగారు - పొగాకుకంపెని - పరుచూరు.

౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు కొత్తపల్లి.

౨౧ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, మల్లారెడ్డిపల్లె.

౨౨ మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ.

౨౩ బీరవోలు రామచంద్రారెడ్డిదొరవారు, వెంకటరావుపల్లె.

౨౪ ఏలూరు మాణిక్యరావుగారు, గవిచెర్ల.

# అభినవసరస్వతి

సంపాదకుఁడు — నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది ద్వైమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

## ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 నీతిగీతలు (సుమతిశతకము, చాణిక్యశ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 వాసంతికాపరిణయనాటకము | ... | 0 | 4 | 0 |
| 4 కలికోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 7 స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 8 శుద్ధాంధ్రనిరోష్ఠ్యచంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 9 సూతసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | 0 |
| 10 భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 11 ధర్మనిర్ణయము | ... | 0 | 4 | 0 |
| 12 అస్పృశ్యతానివారణఖండనము (మల్లాది రామకృష్ణ చయనులుగారు) | | 0 | 8 | 0 |
| 13 స్కాందపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 14 డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 15 డిటో నాగరఖండము (౩ సంపుటము) | | 1 | 8 | 0 |
| 16 డిటో నాగరఖండము (౪ సంపుటము) | | 1 | 8 | 0 |
| 17 మల్హణచరిత్ర | | 0 | 12 | 0 |
| 18 భాగవతరహస్యములు | | 0 | 4 | 0 |
| 19 సోమేశ్వరశతకము | | 0 | 2 | 0 |
| 20 జాతకచర్య (స్వీయచరిత్ర) | | 1 | 8 | 0 |
| 21 మధూకాంబరీవిడంబనము | | 0 | 4 | 0 |

అభినవసరస్వతి కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోష్టు,
గుంటూరు జిల్లా.